

శ్రీ వాడియాల భక్త బృందం

వారి అభినందనలతో

శ్రీ శ్రీ శ్రీ

# సనారి విశ్వేశ్వర స్వామి

## తత్వకీర్తనలు



# శ్రీ శ్రీ శ్రీ సనారీ విశ్వేశ్వర స్వామి

# తత్వకీర్తనలు



: రచయిత :

కోలశంకర్ S/o. పాపయ్య.

వాడియాల గ్రామము.

మిడ్జిల్ మం॥ మహబూబ్‌నగర్ జిల్లా.

ప్రతులు : 501

ద్వితీయ ముద్రణ :2008

ప్రచురణకర్తలు :

**శ్రీమతి. కోల పద్మమ్మ.**

**శ్రీ కోల పాపయ్య**

**శ్రీమతి కోల బుచ్చమ్మ**

**శ్రీ కోల జంగయ్య**

మిడ్జిల్ మండలము.

మహబూబ్‌నగర్ జిల్లా.

**శ్రీ వాడియాల భక్తబృదం.**

: ముద్రణ :

**విష్ణు గ్రాఫిక్స్**

**మల్టీ కలర్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్**

పోస్టాఫీసు ఎదురుగా, మెయిన్‌రోడ్,

నాగర్‌కర్నూల్. ఫోన్ : 08540-225295.





**శ్రీశ్రీశ్రీ సింహాద్రి సనారి విశ్వేశ్వర అవదూత స్వామి వారు**

**శిష్యులు క్వాలకుంట్ల తిరుపతిరెడ్డి స్వామి, రమణమ్మ శ్రీశైలం**

**సనారి విశ్వేశ్వర భక్త బృందం, వాద్యాల.**

**శ్రీరస్తు** ఓం **శుభమస్తు**

కం. ఆకాశమే నా భువనము, నేకాకియు నేను శక్తి, యడమను గలిగెన్
ఏకాలమందు నిలచెద, నాకేకలి గుండు విశ్వనాధాఖ్యంబున్.

కం. శ్రీశైల గృహవాశిని, కాశీవిశ్వేశ్వరుణ్ణి, కైలాసపతిని, కేశవమూర్తిని, బ్రహ్మని
జేసులపై నాది బ్రహ్మశక్తియు నేనే.

కం. నా యోగముతో సరిగల దేయోగము చూడలేదు యే లోకములో నా యోగ
భోగమందిన, మాయాతంత్రం బువాని మానకకలదా.

కం. నేనే విశ్వబ్రహ్మము, అననమున మున్ను బుట్టినామ యవంశంబేనని తలపుడి
దయపంచానన కులమద్ధరింప జననం బైతిన్.

గీ. మాఘ కార్తీక వైశాఖ మాసములను మాలమాదియు శ్రవణాంతమునకు
శుక్రవారము, సోమవారము వరుస నిత్యమునను పూజించువారికి
మోక్షమిత్తు.



శ్రీశ్రీశ్రీ విరాట్ పోతులూరి

వీరబ్రహ్మేంద్ర స్వాముల వారి

శిష్యులు

శ్రీ పాముల అయిలయ్య స్వామి

కందుకూర్ గ్రామము



శ్రీశ్రీశ్రీ కలియుగ అవతార మూర్తి



శ్రీశ్రీశ్రీ విశ్వేశర స్వామి వారు

**శ్రీ సనారీ విశ్వేశ్వర సంవాద" మను గ్రంథమందు**
**శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వరస్వాముల వారు స్వయముగ చెప్పిన**

## మానస పూజా విధి

ఓం నామ రూప క్రియా రహితంబైన యా మహద్వస్తువై వెలుగంగుచున్న దానికి నేజేయు పూజా తంత్రంబులు శాశ్వతంబులై వెలుంగుగాక

ఓం మహాదేవి నదినదాబ్ధి మహాజలంబులు నీకు నభిషేకంబులుగా - మృత్యుశిలా దారు జంతు సలిల సహితంబైన చతుర్దశ భువనంబులు నీకు గంధంముగా నక్షత్ర గ్రహరాశి మహామండలావృత పరాగ కేసరీ యుక్తంబైన మహాకాశము నీకు పుష్పంబుగా - నిద్యా నింద్యంబులు లేక సర్వ దిగ్భ్రమణంబగు తుహినకళ భూషరాగ ఆకాశ దూపంబునుంగల వాయువ నీకు ధూపంబుగా - సర్వాశిని యగు అగ్ని నీకు దీపంబుగా ఇన్నియును గలిసి నేనైన నేనే నీకు ప్రసాదంబుగా నర్పించితి గైకొనుమా! భక్తరక్షణోత్సహివై రక్షింపుమా! నమోనమోనమః !

శ్రీ విశ్వబ్రహ్మోర్పణమస్తు - ఓం శాంతి శ్శాంతి శ్శాంతి:

### శ్రీ సనారీశ్వర స్తుతి (ప్రార్థన)

1. క్షీరాచల ప్రభాసితం
వీరాచార్య తనూభావం
అన్నపూర్ణేశ్వరీ ప్రియం
సనారీశం నమోస్తుతే!!

2. సింహాద్రి భవ్యగృహాఖ్యం
విశ్వనాథ పవిత్రాఖ్యం
అవధూత మునీశ్వరం
సనారీశం నమోస్తుతే

3. దివ్యతపః ప్రభాసితం
శాపానుగ్రహ వాగీశం
కాశీవిశ్వేశ్వర తేజం
సనారీశం నమోస్తుతే!!

4. అకాల మృత్యుహరణం
సర్వదారిద్ర్య వారణం
శోకభయార్తి దారణం
సనారీశం నమోస్తుతే !!

5. సర్వప్రపంచ ధారణం
నిత్యకల్యాణ పూరణం
జన్మసాఫల్య కారణం
సనారీశం నమోస్తుతే!!

ఓం మడి మైలల పట్టింపులేక కులమత భేదము లెంచక స్త్రీ పురుషు లెవరైన నీ మానస పూజావిధిని, స్తుతిపంచకమును ప్రతిదినము ఉదయము నిద్రలేచినపుడు రాత్రి శయనించునపుడు పఠించిన వారికీ శ్రీ సనారీ విశ్వేశ్వరస్వామి వారి దివ్య అనుగ్రహం కలుగును.



## శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ సింహాద్రి సనారి విశ్వేశ్వరా స్వాముల వారు

విశ్వములో విశ్వనాథవదూతయై
విశ్వేశ్వరుండవతరించెనయా !
విశ్వములో తాను శాశ్వితంబుగా నుండి
విశ్వనాథుడనని పల్కెనయా !
దుష్ట సంస్కర్తయై శిష్ట పాలనాధ్యక్షుడై
ముక్కనులు చూపేనయా
అష్టాంగ యోగముల్ సృష్టి స్థితియు థెల్పి
దాక్షాయని నీ వడి జూపెనయ

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ మద్విరాట్ పోతులూరీ వీరబ్రహేంద్ర స్వాముల వారి 1625 సం॥ ప్రాంతమున వారి కాల జ్ఞానమందున చెప్పబడింది. గౌరీమాంబ వీరాచార్యుల దంపతులకు 1794 సం॥ సరియైన నందన నామ సం॥ కార్తీక శుద్ద పంచమి సోమువారం శ్రావణ నక్షత్ర యక్త మకర లగ్నమున శ్రీకాకుళం జిల్లాలో పాలకొండ గ్రామంలో శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ సింహాద్రి సనారీ విశ్వేశ్వర స్వాముల వారు జన్మించిన ప్రత్యక్ష నిదర్శనం.

**చింతాడ శ్రీశ్రీ గిరినాథ్ స్వామి.**

## శ్రీ సనారీ విశ్వేశ్వర స్వామి భజన కీర్తనలు
## గణపతి ప్రార్థన



### 1. త్రిపుట తాళం

1. శ్రీ గజానన - గజానన మహరాజ - ఓ గజానన !!
ఓ గజానన శ్రీ గజానన సర్వాంతర్యామి
గజానన మహరాజువు బ్రహ్మడ మంతట !! శ్రీ !!

2. శరనుజేతు ! శ్రీ పాద శ్రీవల్లభుని ! భజనజేతు !
మెరవిని దయరాద మణిక్య ప్రభువరా !
పరిపరి విధముల స్మరణ వినరావైయ్య !! శ్రీ !!

3. మీకు మ్రెక్కెద ! నరసింహ్మా సరస్వతి ! పాద దాసుడా
అకిల లోకముల కెల్ల దలతురు వెంకయ్య స్వామి
చేకోని రక్షింపవైయ్య !అక్కల్ కోట మహారాజ !! శ్రీ !!

4. ఎంతో రుచిరా ! సాయిగానమృతం ! మధిలోన మరువరా
మంతనంబున నిన్నె అంభ శంకరా దేవ !
సంతసంబున అంత దయ గలగని మాపైన !! శ్రీ !!

5. నిత్యగానము ! శ్రీ విశ్వనాథుని ! నిత్యజపము
దాతవైన పోతులూరి స్థిరమగు వాడ్యాలలో !
నిత్యము నిను దలుతుము దత్తత్రేయ మమ్మేలు !! శ్రీ !!

## 2. ఏక తాళం

1. గజానన మహరాజా ! మా మోర వినవే మహరాజా !!గజా !!
గజానన మహరాజువు నీవట !
భజన వినగ నీవు సరుగున రావా !!గజా !!

2. స్మరించెదను మహారాజా ! మముగన్న దొరవే భవతేజ
నా మదిలోపల నిన్ను నమ్మిన !!
సమ్మతించి సహయము జేయవే !!గజా !!

3. అవనిలోన గురురాజా! సద్గురు రూపుడవే తేజా
భావము తెల్పిన పరమ భక్తులకు
దివ్య మహిమలు చూపితివంట !!గజా !!

4. మాణికాంభ ప్రభుతేజా !ఓ! అంభ శంకర రాజా !
కన్నతండ్రి వాడ్యాల పురంబున
విన్నవించవే సరుగున అభయము !!గజా !!



## 3. ఆట తాళం

1. ఆనందంబుగ నిన్ను భజియింతుమైయ్యా శ్రీ గురు పాదములు పూజింతుమైయ్య!!
తనయుని నేరములు ఏన్నుటే భాగ్యమా కన్న తండ్రివను కున్నను దేవ
!!ఆ !!

2. తనువు ఎప్పటికి శాశ్వతము గాదు ! ఎన్నో కోవైయ్య శ్రీ గురు సన్నిది
అమవు అనువున వున్నదయ్యా !! తనే !! బ్రహ్మండనాయకుడైయ్యా
!! ఆ !!

3. కలియుగ అవతారుడైయ్య ! శ్రీ పరమాత్మ !ఏలుకొవైయ్యా శ్రీ జగదేకవీరా !
పాలకొండలో వెలసి శ్రీశైల పురికొచ్చి కాలగ్ననము తెలెపుచుండునవైయ్యా
!! ఆ !!

4. మల్లిరాదు జన్మ అవనిపైమీకు ! శ్రీ విశ్వనాథునీ ! లీలాలు చూచుటకు !
మలీనదేహము బేంచి కూలిన భాదలో నీవు-నీలో వున్న పరమాత్మ నెరుగుటే చాలు
!!ఆ !!

5. మారేడు దళములు పండ్లు పూలు మీకు వీరబ్రహ్మా నంద శ్రితజనపోషక
మరువాక వేడుదుము ధరను శ్రీ వాడ్యాల పురమందు వెలసిన దాసాను దాసులము
!! ఆ !!

## 4. శ్రీ విశ్వనాథ ఏకతాళం

1. రాజ్యాపాలన నీవెకదా ! ఇకా ! భయమేల మాస్వామి కదా రాజువడనీవు!
రాజాయేగి పరమాత్మాడవట నీవు
రాజలకే రారాజువట నీవు !! రా !!

2. అంతరంగములో నీవెకదా ! ఇక ! వింతలన్ని తెల్పినవుకదా !
ఎంతవెతికి నిను సంతసంబునను
అంతరంగములో గుహలో వున్నవట !! రా !!

3. పరమేశుడవు నీవె కదా ! పరమాత్మపురుషుడవు నీవేకదా
పరమాత్ముడవని పరమగురుడువని !
పరమ భోదలు తెల్పు దాసులకు !! రా !!

4. అవనిలోపల నీవెకదా ! అ ! వీరబ్రహ్మము నీవెకదా
అవనిలోన వాద్యాలపురమున పావనంబుగు నీ నామము !! రా !!

## 5. ఆది తాళం

1. అవదూతవై వెలసినవా ! స్వామి ! మహిమలుచూపీ యున్నావా
పావనమైన శివనామ మంత్రము
విశేశ్వరడవు జగతియందు వెలసిన !! అవ !!
2. పాలించు జగదేకవీరుడా ! శ్రీ ! పాలకొండమందిరుడా
కోలువైయున్నాడు తానే సతిసమేంతంబుగ !
పలు విధంబుల గురుభోదలు తెల్పిన !! అవ !!
3. హరుడవు గురుడవు నీవె ! ధరణీ! భక్తపాలిట దైవము నివె !
వీరచార్యుల గౌరిదేవి తనముడవట నీ
మురయుంచో అవతరించిన సృష్ఠలోపలను !! అవ !!
4. విశ్వబ్రహ్మన దేవుడతడు ! శ్రీ వీరబ్రహ్మమునైనాడే ! వి !
విశ్వనాథుడమ్మా వాద్యాలిపురములో !
విశ్వమెల్లను తెలుపుచుండెను భోదలు. !! అవ !!

## 6. ఏక తాళం

1. గురుదేవ మము బ్రోవు – ఓ కరునాంతమము మము బ్రోవు
గురుడవు నీవని– హరడవు నీవని !
హరివి గురువు – హరే బ్రహ్మము నీవని !!గురు!!
2. శరనని నిన్ను పిలచీ ! నీ చరనములు ఈక దలచి
కరములతో నీ చరనములు బట్టెదను
మురిపించెదవో – అర్పించదవో !!గురు!!
3. మాటిమాటికీ నిన్ను ఇక సూటిగాను భజించెదను
గుట్టు తెలపీ గురుభోదలు తెల్పుము !
గట్టిగను నిన్ను విడవ మదిలో !!గురు!!
4. నందనందనుడోయమ్మా ! ఆ వీరబ్రహ్మామోయమ్మా
నంద నంద నీ భజనే మరువము
సందులేక వాద్యాల పురంబులో !!గురు!!



## 7. ఆది తాళం

1. పోదాము పాదవమ్మా మనసా ! గురుని ! పాదపూజలు సలుప మనము !
పోదము మనమంత – పొందుగ జాతగూడి
అందరము కలసీ భజనలు జేతము స్వామి !! పోదాము !!
2. తిర్నల జాతరలంట్ట స్వామి ఊరేగింపులు రథములంట్ట
పార్వతీ పరమేశ్వరుల కళ్యాణము
శ్రీ పాలకొండలో పల్లకీ సేవజేయుమనము !! పోదాము !!
3. ఓంకారీశ్వరుడు అతడే !శివ! శంకరుడుతడే
ఏకమైయున్నడు – ఏ కాలమందున !
ముక్కనులు జూపీన ఈ లోకమందున !! పోదాము !!
4. గురుపూజలే జేసునంట ప్రతి యుగమునందన జేసునంట !
శ్రీశైల పురుమందు గురువు పూజలే చేసు !
పరామాత్ముడమ్మా వరము లిచ్చేటి తండ్రి !! పోదాము !!
5. హరహరయని ముందు దలుపు ! వీరబ్రహ్మానంద శ్రీగురువు
స్థిరముగ వెలసున్న వాద్యాల పురమందు
‘ సింద్రివాసుడే ! మమ్ము రక్షసించును !! పోదాము !!

## 8. సద్గురు మూర్తికి శ్రీ విశ్వనాథ ఏకతాళం

పల్లవి : రారమ్మా సద్గురు మూర్తిని జూడను బోదమును
పారమ్మ సద్గురు మూర్తిని సేవలుసలుపుదము ! !! రారమ్మ !!
1. పరమ పావనుడు పార్వతీశుడట !
సద్గురు మూర్తికి వెలసియున్నడట !! రారమ్మ !!
2. కలియుగంబున– విశ్వనాథుడట
వెలసియుండె – శ్రీ పాల కొండలో !! రారమ్మ !!
3. దండిగను భదిరిక వనము గుహలోపలను వున్నడట !
అండ పండ బ్రహ్మాండబంతటవెండికొండ నివాసుడే !! రారమ్మ !!
4. ఏలుచుండే వాద్యాలపురమును – వీరబ్రహ్మాగురుదేవుడు !
పాలలోచన విశ్వనాథుడట ఏలుచుండె భక్తను దాసులను !! రారమ్మ !!

## 13. త్రిమూర్తుల మంగళహారతి ఆటతాళం

1. మంగళమనరమ్మా ! మా[ప్రభువునకు ! మంగళన రమ్మా !!
మంగళమనరమ్మ శ్రీ గురుదత్త[త్రేయునకు!
శ్రీ గురువు నకు సర్వమంగళ హారతులు !! మంగళ !!

2. అష్టాదిక్పాతకులకమ్మ ! మాగురుమూర్తి ! సృష్టిపోషకుడమ్మా!
సృష్టిలోపల అవతరించే విశ్వ[బహ్మాన దేవుడై !
దిట్టముగ నమ్మిన భక్తుల కష్టాములు భాపునమ్మా !! మంగళ !!

3. విష్ణు ఈశ్వరులకు శ్రీ [బహ్మాకు సర్వ మంగళమనరే !
విష్ణు ఈశ్వరా [బహ్మామైయిన విశ్వనాథుడే ఒక్కడే
మున్నుబుంట్టిన అవనిలోపల విశ్వనాథుడే శివుడే !! మంగళ !!

4. ధరణీ లోపల వెలసేను ! వాడ్యాల పురమున ! అంభ శంకరుడమ్మా
మరువకను శ్రీ వీర[బహ్మాము మథర్‌హుసేన్ వల్లికీ
సర్వమంగళమీవ్వరే ఆఖీలాండకోటి[బహ్మాండమంతట !! మంగళ !!

## 14. ఏకతాళం

1. మరువాను గురుదేవా [ప్రభువును - విడువాను మదిలోపల ! 2 !
మరువక విడువక స్మరణ జేశేధను
కరునాకర మా హృదయ మందీరా !! మరువాను !!

2. హరుడవు నీవనీ - గురుడవు నీవనీ - నమ్మినను మా[ప్రభువనీ !2 !
హరుడవు నీవె గురుడవు నీవె!
వీర[బహ్మామే విశ్వనాథుడట !! మరువాను !!

3. హరీవిగిరివీఈ ధరికీ [త్రీభుడవు - పరిపాలించర భక్తులను ! 2 !
హరిహరియనినా - హరహరయనిన
హరిహరుడొక్కడే శివుడు వినరా !! మరువాను !!

4. దండిగాను వాడ్యాల భక్తులకు - అండగాను నీ నామ గానమే ! 2 !
ఆండపిండ [బహ్మాండంబంతట
వీర[బహ్మా గురుదేవుని మహిమలు !! మరువాను !!



## 15. విశ్వనాథ ఏకతాళం

1. గురువరా శ్రీ గురులింగా - నీ దయరాని [ప్రభులింగా !
గురుడవు హరుడవు పరమేశ్వరుడవు !
పరమదయలో దవళేశ్వరుడవు !! గురు !!

2. జయకరా శ్రీకరలింగా - శ్రీ పాలకొండ గురులింగా
జయకరా శుభకరా పరమపావన !
జయములివ్వు నీ పాదదాసులకు !! గురు !!

3. కరునాకరా దయలింగా - ఓ - ఉమహేశ్వర లింగా ! కరు !
కరునాకర శ్రీ విశ్వనాథుడా!
పరమభక్తులను ఏలుచుందువటా !! గురు !!

4. అభయము నీవ్వుము లింగా - శ్రీ - వీర[బహ్మాగురు లింగా !
అభయము వాడ్యాల అంభశంకరుడే !!
నిర్భయముగా కవి దాసా పాలన !! గురు !!

## 16. ఆటతాళం

1. ఏలరా ! మమ్ముల ఏలరా ! కైలాసావాసా ! ఏ !
పాలలోచన భక్తపోషన ఎలవానీ కరునతోన !
పలు విధంబుల బీలుచుండేదా నీలకందర మమ్ము [బోవుము !!ఏలరా!!

2. వెదరా ! గురుని చూడరా ! శ్రీ విశ్వనాథునీ ! వె !
చూడ చక్కని దేవుడమ్మా - వెండికొండనీవాసుడమ్మా
దండిగ కొలచిన భక్తుల అండ జేర్చుము జగదీశ !!ఏలరా!!

3. మొక్కరా ! దరికే జేర్చురా ! శ్రీశైల వాసునీ ! మొ !
[గక్కునను మర్కేండుని [బోచిన విధముగా మమ్ముల
టక్కునను నా ఆత్మ వెల్లిపోయెటప్పుడు దిక్కునీవని !!ఏలరా!!

4. దాసుడా ! దయజూడరా ! శ్రీ వీర[బహ్మాము ! దా !
వాసిగాను వాడ్యాలపురమున దోసిలొగ్గెను నీదు కృపకు
విశ్వమైయని బంటు నైతిని దాసులకు దాసుండరా !!ఏలరా!!

## 17. ఆటతాళం

1. దేవి లలితాంభదేవిరవా ! శ్రీ చక్రపాలీ !! దేవి !!
దైవము నీవని దేవత నీవని
దేవతలందరు నిను వేదగను !

2. దయ - జూడవే శ్రీ భ్రమరాంభ ! శ్రీశైలమందు ! !! దేవి !!
దయ జూడవమ్మా ఈ దీనులపైన
దయతో మమ్ముల ఆదుకో జననీ ! !! దేవి !!

3. లక్ష్మి - సరస్వతి దేవి ! శ్రీ ఆదిశక్తి !! లక్ష్మి!!
లక్ష్మి సరస్వతి మున్నగువరాలు !
లక్ష్యముతో నీ సేవలు జేయగ !! !! దేవి !!

4. బ్రహ్మ విష్ణు సదాశివుడు ! శ్రీ అన్నపూర్ణ !! బ్రహ్మ !!
బ్రహ్మంబు నెరిగిన శివుడే నీ ఆసనము
బ్రహ్మనందంభయే వాద్యల పురమందు !! దేవి !!

## 18. ఆటతాళం

1. అన్నపూర్ణ విశ్వనాథుని- పెండ్లికి బోదమురారే
ఎన్ని విధంబుల సన్నుతిజేసిన !
అన్ని త పత్రములు విన్నవించిన !! !! అన్న !!

2. బ్రహ్మానందము పరమానందము - బ్రహ్మాండంబతట జుదేరే
బ్రహ్మానందాచార్యుల భ్రమరాంభ దేవికి !
అమ్మ అన్నపూర్ణమ్మ జననమొందెను !! అన్న !!

3. గౌరీమాంభ వీరచార్యుల - మురయుచును తనయుండవే
గౌరిదేవికి వరుడవై నీవని !
కారణ రూపుడవై ఉధ్భవించిన !! అన్న !!

4. లోకకళ్యానంబు జరిగేను - లోకమందున జూడరే
లోకేశ్వరుడే కళ్యాన వరుడై !
లోకమునందున సుమంగలిపురములో !! అన్న !!



5. దండి దేవతవు నీవమ్మా -నీ- అండ జేర్చుకోమాయమ్మ
నిండేను భక్తి వాద్యాల పురమంబున
దండిగా భోజనలు లోకమంతటనమ్మా !! అన్న !!

## 19. విశ్వనాథ ఆటతాళం

1. పాలకొండవాసా పరబ్రహ్మ వీశ్వేశ్వర -నీ- లీలలు ఎన్న మా తరమా దేవా !
కైలసావాసుడవు కాశీ విశ్వనాథుడవు !
కొలువైతివి స్థిరముగ శ్రీ శైలాపురంబున !! పాల !!

2. ఎన్నో మహిమలు జూపదోడగేను - బ్రహ్మాండ మంతట దీన జనుకును
మనసునకు మందుబోపేను ఎన్న తరమాస్వామి మహీమలు !
నిన్ను మెన్ననే రామచిలుకకు మోక్షమిచ్చిన గురువరేణ్యుడు !! పాల !!

3. చచ్చిన ప్రాణాలను బ్రతికించిన ఘనుడవే-జగమంతట నిండిన పరమాత్ముడవే !
చచ్చిన గొర్రెపిల్లను బ్రతికించి చూపిన విశ్వనాథుడే
రచ్చరచ్చలు నీదు స్మరనే రానించి పొగిడితి నాదు మదిలో !! పాల !!

4. ధరణీ లో వెలసిన స్థిరమైన వాద్యాల-పరమ పావన రూపా అంభశంకరా దేవా!!
పరమపావనమైన సద్గురు రూపుడవె ఈధరణి యందున
ధరవర గీరీనిలయ మా స్మరనవిన రావ దేవ !! పాల !!

## 20. విశ్వనాథ ఆటతాళం

1. గురుదేవ మమ్ము బ్రోవవైయ్య ! నిన్నె !నెరనమ్మి యున్నామైయ్యా
గురుడవు నీవని హరుడవు నీవని !
గురువు హరుడవు నివె - పరమాత్మడవు నీవె ! !! గురు !!

2. మనక నిను దలతుమైయ్యా ! మా స్వామివని నిన్నె కొలుతుమైయ్యా
మున్ను చేసిన కర్మా - లన్ని తొలగించె ప్రభువని
అన్ని నీవనుకున్న మన్నించె ప్రభువన్న !! గురు !!

3. కలియుంగబున జూడరైయ్య ! సింహాద్రి వాసుని గొలువరైయ్య
పాలకొండ నయందు భూలొకంబున గురువై !
పాలించే పదనాల్గు కోట్ల జీవరాసులను !! గురు !!

4. పరమ పావనుడవైయ్యా ! గురు పోతులూరిబ్రహ్మ మైయ్య
స్థిరముగ వాద్యాల పురమందు ఓ దేవా
దర్శిన మించిన మొర సేయు దాసులకు !! గురు !!

4. వీరన్న వినవె మా మొర వినవె !
గురుదేవుని జేర ఉపాయము జెప్పవే !! నా !!
5. దండి భలుడవు ధరణి యందున
దండి దక్షుని దృంచిన ధీరుడా !! నా !!
6. అంభశంకరుడే ఆదరించునని
వాడ్యాల దాసాకవి మేర చేయుచును !! నా !!

## 30. త్రిపుట తాళం

కందార్థం : శ్రీ దన్యులైన గౌరీ, నాథుడు వీరాగ్రయోగ నామాచార్యుల్
ఈ ధన్యుగనియె దేశిక, నాథుడ సింహాద్రి విశ్వనాథాచారిన్.

1. జగతినేలే గురుదేవ రావెమైయ్య - మా తండ్రి ప్రభుదేవ రావేమయ్య !!జగతి !!
జగతిలో కొలువైయిన అంభ శంకరుడమ్మ
యుగయుగంబున వెలసిన కైలాసా వాసుడ !!జగతి !!
2. పరమ పావన రూపుడవు నీవైయ్య - పార్వతీ రమనుడవు నీ వెనైయ్య
శ్రీ గురువై జన్మించిన కలియుగ మందున
గౌరి వీర మొగులు తనయుడ !!జగతి !!
3. పరమ భక్తుల నెల నీవెనైయ్యా - ధరణిలో చటించితివని వింటి నైయ్య
పరమేశ్వర ఆవతార నామొర వినరావైయ్య
కరునాల వాలా సింహ్మాద్రి విశ్వనాథ ! !!జగతి !!
4. విశ్వనాథ అవదూత నీవునయ్య - విశ్వమును ఘ్రూటించే దేవుడవైయ్య
వాసిగ వాడ్యాల పుర అంభ శంకరుడవని
శాశ్వితముగ కవిదాసు నేలే దెన్నడో !!జగతి !!

## 31. ఏక తాళం

పల్లవి :లింగన్న మా లింగన్న మా చెరువు గట్టు లింగన్న లింగన్న
1. జంగమా దేవుడవు చెరువుగట్టు యందు నీవు -
ఉపొంగి భక్తుల ఏలుతున్నవట !!లింగ !!
2. దండి దేవుడవని ధరణి జనులెల్ల - దండిగా వచ్చి నిన్ను కొలసి వేడిరట !! లింగ !!



3. నాడు నేడు నా భాదలు దీర్చేటి-మూడు గుండ్ల పైన ఇంపైన లింగమట!!లింగ !!
4. జడల స్వాములంత గలసి పాటలును పాడిరట-
జోడుబాయకను కవిదాసు నేలుతున్నడట !! లింగ !!
5. మొరాలాలాకించె దేవుడవట- స్థిరమైన వాడ్యాల శివ లింగమట !! లింగ !!

## 32. ఏక తాళం

1. స్థిరముగ నమ్మిన గురుదేవుని నా చిత్తము నుంచెదెన్నటికో
అరమర సేయక ఆత్మ రక్ష నా అత్మలింగమై ఏలుకో !! స్థిర !!
2. పలుకవేమి నే నెంత పిలచినను అలుక నేల నన్ను ఏలుకో
కలియుగంబున రామ చిలుకకు మోక్ష మించినది ఎందులకో !! స్థిర !!
3. నిన్ను మించిన ఘనులేవ్వరున్నరు కన్నతండ్రి నన్ను ఏలుకో
మన్నించవె నా వెనకటి నేరము - లెన్న బోకు నన్ను ఏలుకో !! స్థిర !!
4. ఎంత ధలతు ఈ దీననిపై నీ హృదయము కరుగదు ఏందులకో
అంత రంగమున జనుల మృత్యువును కాపాడినది ఏందులకో !! స్థిర !!
5. ధరణిలోన వాద్యల పురంబున ఆది శంకరుడవు ఎందులకో
పరమ పావనుడు అంభ శంకరుడా సరుగున మమ్ముల ఏలుకో !! స్థిర !!

## 33. సద్గురుదేవ ఆటతాళం

1. ఏమి లేదు ఏమిలేదురా ! సద్గురుని కన్న ! ఏమి లేదు రా !
కామక్రోదము లారుగట్టి కాలుని మాయను గొంటి
ప్రేమతో శ్రీ వీరబ్రహ్మము నామము పటించు వారికి !! ఏమి !!
2. ఏరుకలేదు మరుపులేదురా ! పరిపూర్ణ భోధ ! తరుగులేదు వీరుగులేదురా !
సరసముగునే నానే భావము మరచి మగ్నంబయ్యే వారు !
వరుసతో ద్వాదాశాక్షరి తలిచి బ్రహ్మము గన్న వారికీ !! ఏమి !!
3. చూపులేదు మాపు లేదురా ! సూక్ష్మాపు దారి! రూపులేదు మాపు లేదురా !
దాపుగాను షొడాశాక్షరి నోపిద్యానం జేసే వారికీ
ఆపదలు లేవనుచు దేలసితే తేప తేపకు నమ్మేవారికీ !! ఏమి !!

4. వాదమేమి బేదమేమిరా ! హంకారముడగిన! మీద ఏమి బాద లేదురా !
సాధు సజ్జన సేవ జేసి బోద పంక్ష దళాని గాంచి
సాదుగ బ్రమ లన్ని వదిలి మేద స్వప్నము గన్న వారికి !! ఏమి !!

5. వుట్టి మాటలైతే గావురా ! ఇది తెలిసివుంటే ! వుత్త దేవుని నమ్మా కొనవురా
సత్తు చిత్తు గానీ మెత్తము బ్రహయ్య చరనములు
దత్తము శ్రీ వీరబ్రహ్మము వాఖ్యములు గనుగొన్న వారికి !! ఏమి !!

## 34.ఓం కీర్తన ఆది

1. ఎన్నిమాయల జూపేనోయమ్మా శ్రీ పాలకొండా విశ్వబ్రహ్మణ దేవుడోయమ్మా
ఎన్ని మాయల జూపినాడే యెరుగ నైతివి స్వామి మహిమలు
నిన్న మెన్ననే రామ చిలుకకు మోక్షమార్గము దెలిపినాడట. !! ఎన్ని !!

2. చచ్చినప్రానుల రంక్షించే జగదీశ్వరుడా జగము నెల్లా తానెయైయుండే
వచ్చిన దాసులు అందరు చెత్తిలెత్తి మ్రొక్క చుండిరి
మచ్చికతో వారందరికీ ఎన్నో మహిమలు జూపదొడిగెను. !! ఎన్ని !!

3. విన్నపము ఆలింపరేమయ్యా అన్నపూర్ణదేవిని ! సమాదిలో ఉంచెగదనయ్యా !
చిన్న పెద్దలు జూచు చుండగ మళ్ళీదెచ్చును మందిరమునకు
యెన్నో విదముల జేసి దేవిని అందులో సమాది లుంచెను. !! ఎన్ని !!

4. ఆవదూతై వెలుగు చుండేనా భూలోకమంతట కాలజ్ఞానంబు దెలిపెనా
పావనుండై శ్రీశైల పురములో అదృస్యమాయే
బావముగ బొమ్మరాజు పల్లిలో కమలదాసుని కోర్కెదీర్చే !! ఎన్ని !!

## 35. ఏకతాళం

సమ : శివాయని పిలచిన పలుకవు - నామది లోపల గురుదేవ
నమో నమో శివ సాంబ సదా శివ - శంబో శంకర గురు దేవా
ఆత్మ జ్యోతివై వెలిగెదవటనీవు - మృత్యుంజయుడవు గురుదేవా
ఆత్మ లోపల నిత్యము నిన్నె మరువక దలిచెద గురుదేవా
జీవుల కర్మలు తెలిపేటందుకో - నిత్యము ద్యానములు టివీగా
శివ శివ శంకర సర్వ జీవులకు ప్రాణము పోసేటి గురుడవుగా
లింగారూపమే మానవరూపం - పాలకొండ సద్గురుడవుగా



జగమునేలే జగన్మాతనే - పాలకొండలో వెలసే గదా
భార కర్తవని కోరి వేడినను - బార మేమి మము బ్రోచుటకు
గురవరా గురువరా వీరబ్రహ్మ గురుదేవుడే మమ్ముల బ్రోవు కదా
వాసీ గను వాడ్యాల పురంబున - అంభ శంకరుడు నీవే కదా
దాసుడైన కవిదాసా పాలన జేసేటి గురుడవు నీవే కదా

## 36. త్రిపుట తాళం

పల్లవి : రండి జనులంత మీరంత - పాలకొండ గురుదేవుని దలుతాము!! రండి రాడండి!
లెండి భక్తులారా మీరంత కలియుగ దేవుని వేడ బోదము!! లెండి లేలెండి!

1. ఆ కొండ ఈ కొండ పాలకొండలోన! జగతిలోన వెలసిన జగత్‌గురుడమ్మా !!జ!! !!2!!
మూగవాళ్ళకీ మాటలిస్తుండట- గ్రుడ్డివాళ్ళకు చూపులిస్తుండట ! !!రండి!!

2. జననమరనలు లేనంటిబోదలు - మానవులకు తెల్పిన గురుడమ్మా
కలియుగ మందున శ్రీరామ చిలుకకు మోక్ష మిచ్చిందట ! !!రండి!!

3. పాలకొండ యందు ఎన్నాన్నో మహిమలు అన్న దానము జేసినాడమ్మా
భూలోక మందున పార్వతమ్మను దండి జనులకు చూపినాడంట !!రండి!!

4. గౌరీదేవికి వీరమొగులకు పుత్రుడై జన్మించె మల్లికార్జునుండమ్మా
విశ్వమును సృష్టించె విశ్వములోపల విశ్వనాఘుడే వెలసినాడంటా !!రండి!!

5. అవనికే వెలుగై వెలిగి పోతున్నడు - సింహాద్రి వాసుడే గురుదేవుడోయమ్మా
వేద విద్యలన్ని తెల్పుతున్నడంట - వాడ్యాల పురమందు కవి దాసుడంక!!రండి!!

## 37. ఏకతాళం

పల్లవి :పరామ నందం - మా సత్య నందుని భజనే నిరతము !ప!
పరామానందం బ్రహ్మానందం
బ్రహ్మ దేవతల సకలనందం !!పరమ!!

2. కరములతో - నా స్వామి చరనములు పూజ చేసేదను !క!
పరమ పావనుడు పరమేశ్వరుడే
గిరిపై నుండి ధరణికి వచ్చెరా !!పరమ !!

3. పాలించ వచ్చేనమ్మా - మమ్ముగన్న తండ్రి మమ్మేలనమ్మా !పా!
కలయిక అయిన త్రీమూర్తులురా !
కలుగొన్న వారికీ కలుగును మోక్షం !!పరమ !!

4. ఉపొంగి పోగిడెనమ్మ - వరదాస కవినేలుతున్నడమ్మా !ఉ!
తప్పక మదిలో అంభ శంకరుని
ఇప్పుడే ఏలు వాడ్యాల దాసా కవి !!పరమ !!

## 38. ఏకతాళం

1. జడల రామలింగ స్వామి - విడువాక దలతు నిను స్వామి
జడల బెంచుకొని నీ స్మరణలతో శివ శివ యనుచు
అడుగు బజనలె ఆడు తున్నరట !!జడల !!
2. మూడు గుండ్లపైన స్వామి - ముడుపు లందుతున్న నీవె స్వామి
విడువక మదిలో లింగ లింగయని
దండి జనులు నిను కోరి మొక్కెరట !!జడల !!
3. మమ్మల గవా రావా స్వామి - మమ్ము గన్న తండ్రి లింగస్వామి
నమ్మిన భక్తుల కలలో కనపడి
సమ్మితించి దరి జేర్చుకుందువట !!జడల !!
4. దండిగ దలుతుము స్వామి - మా అంభ శంకర స్వామి
అండ దండ వాడ్యాల పురమున
దండి దాసులను ఏలుతున్నడట !!జడల !!

## నియమము

సీ !! స్నానంబు చేతునని చలినీళ్లకును బోయి
పోద్దున్నమునిగిన ముద్దు గాదు !!
మడి నాకు గలదని తడి బట్టలను పిండి
కట్టకొన్నను మాయ కొట్ట బడదు
ఆచారమున్నదని యాడాడ దాటినా
శోధింపదరాదు యీ శుద్ధ తెలివి
దేవతార్చన జేసి ధీరుడై నిలిచిన
తత్వంబులో గుట్ట దైవమొరుగు
గీ !! నియమమది గాదు తలపులో నిష్టిగాదు
మయల మడిగాదు కులము మర్యాద గాదు



తనువు లోపల తత్వంబు తనువు గురతు
తెలుపు గురు మూర్తి యాత్మను తేటగాను
సీ !! గడ్డాలు పెంచినా కడ్డాలు లేవనీ
ముడ్డి మూయక తాను మూగియైన
హారాలు వేసి విహరంబు చేసిన
కారువాడైనా వికారుడైన
కాషాయములు గట్టి వేషాలు వేసినా
షోషండుడై యుదర పోషణకును
లింగాలు కట్టుకొని జంగాలు యైనను
బంగు పానము చేయు పామరునకు
గీ !! అంగరాహిత్య మేలాగు నౌను దలప
భంగ ఫాటులు ఇవియన్ని పామరములు
వెంగళుల విద్యగా బోలవేల మనము
సంగ రాహిత్య మౌ బ్రహ్మ సాధనముకు
సీ !! అన్నంబు మానియు యాకులు నమిలిన
మేకలు మేయవా మేలు లేదు
కాయ ఫలములు దీని కానలో పెరిగినా
పక్షులకూడు పీల ఫలము లేదు
వాయు భక్షణ చేసి వడి వాడు చుండిన
పాముల కాహర పాటు గాదే
బాడి బుక్కెడు కప్ప బాండ్రు బాద్రనిపలురు
చెప్పుటకది మేల నొప్పు లేదు
గీ !! తప్ప గంజాయి కల్లుల ద్రాగి నరులు
కుప్పిగంతుల జ్ఞానంబు కూడిరాదు
యిష్టమైన పదార్థంబు యింటనున్న
పైని గలిగినావేళకు భక్ష్యమగును.
సీ !! భక్తిచే సాగిల పడి మ్రొక్కువారలు
చెట్టుకు దండాలు బెట్టువారు

## 41. ఏకతాళం శ్రీ లలితాంభదేవి

1. దేవీ లలితాంభ వందనములు నీకమ్మా
భావము నందన నిను నెర నమిన
దైవము నీవనీ కోరివేడితిమి !! దేవి !!

2. కోరిన వరములు ఇచ్చేదవట నీవు !
సారేకు నీ స్మరనాలు జేసేదము !! దేవి !!

3. పాలకొండలో అన్నపూర్ణవై !
కైలాసాంబున భ్రమరాంభికవై !! దేవి !!

4. దాసునీ కృషి భాదలు బాపేనట !
శాశ్వితముగ నీ భజనే మరవము !! దేవి !!

5. స్థిరముగను వాద్యాల పురంబున !
కరము లెత్తీ నీ భజన జేసేదము !! దేవి !!

## 42. ఆటతాళం

1. జనని - నా మనవి గైకోనవమ్మా ! శ్రీ పాలకొండ జనని ! జ !
జనని వైతివమ్మ మా పాలిటనమ్మ
క్షణక్షణంబున నిన్ను దలచేద మాయమ్మ !!జన!!

2. ఎంత వేడిన దయజూడవమ్మా ! నీ సంతసంబున ! ఎ !
ఎంత వేడిన గాని మంత నంబున తల్లి
అంతరంగము నందు మీ నిలయం పాలకొండ !!జన!!

3. గురుని - తోడ తెలుపవమ్మా ! మా అన్నపూర్ణ ! ! గు !
పరుగున మమ్మేల పరుగున బోయినిప్పుడు
త్వరగా తెలుపవమ్మా పరమ భక్తులనేలా !!జన!!

4. చివరి - నా మాట వినుకోవమ్మా ! మీ పాద దాసుడా !చి !
సేవ జేసేధ మీకు అంభశంకరా దేవ!
వాద్యాల పురంమందు స్థిరమైన కవిదాసా ! !!జన!!



## 43. ఆటతాళం

1. ఆది - శంకర అవతార మూర్తి ! శ్రీ పాలకొండ ! ! ఆ !
అందు ఇందున నీవె అంభ శంకరుడవు
సందేహమెందుకు మా యందు దయరాని

2. కొటీ - సూర్యశిరములు గల్ల దేవా ! శ్రీ విశ్వనాథ ! ! కో !
నేటికీ నా పాపములన్ని తెగటార్చా
కఠిన మేలనైయ్య మాట ఇచ్చితివైయ్య

3. దాటీ - తప్పక తలతుము మదిలో ! సింహద్రి వాసునీ ! దా !
కోటీసూర్యుల కాంతి నీ ముఖ తేజస్సు
సృష్టికర్తవు నీవె సద్గురుడవు నీవె

4. దయ - గుణవంతుడైయ్యా ! మా గురుదేవుడు ! ! ద !
నయముగా వాద్యాల కవి దాసు నేలేటి
దయగల దేవుడే అంభ శంకురుడే

## 44. శ్రీ విశ్వానాథ త్రిపుట తాళం

1. ఆనంద శివనంద లహరీ - గురుదేవుడే దొరికే మానసా
అనందబుగ గురుని పాద సేవలు జేతు
మానక మమ్మేల అన్నపూర్ణ ఈశ్వరుడు !! ఆనంద !!

2. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు - కలియుగమందున వెలసేను !
బ్రహ్మాండమంతటి శివుని మైమలు!
బ్రహ్మమయుడే శ్రీ గురుడై నీలచెను !! ఆనంద !!

3. సుందర శ్రీ పాలకొండ - అందువున్నది నిజమైన తల్లి ! సు!
అందముగను శ్రీ అదిశక్తి వమ్మ
ముందుగ జగమందు అందర జూడనమ్మా !! ఆనంద !!

4. పొందుగ నిలచినా డమ్మా ! శ్రీశైల గుహలోపల నమ్మా
ముందుగ కలియుగ మందున పుట్టిన
రుద్రుడే తానంటు భద్రుడై వెలసేను !! ఆనంద !!

5. మనసు నందున పూజింపవే - శ్రీ సనారీ విశ్వేశ్వరుడే
తనువు లోపల జపము జేసేన కన్నతండ్రి వనుచు నిన్ను !! ఆనంద!!
మనకను నా మానసంబున పంచాక్షరీ
6. ధరణీలో పరమాత్ముడమ్మా - శ్రీ వీరబ్రహ్మాము గురుడమ్మా !! ధ !!
మరువక పూజింతు గురుదేవుని నా ఆత్మలో !! ఆనంద !!
స్థిరమైన వాద్యాల అంభశంకరా దేవా !

## 45. మంగళ హారతి ఆట తాళం

మంగళ హారతి పరమ మూర్తీ నీకు - నింగిన సాతలమా నిండిన వారికి
భంగరు హారతీ అంభ శంకరునకు
వేగమే మము బ్రోచే సద్గురు నీకే !!మంగళ !!

1. పాలనేత్రము గల్ల గురుదేవునకూ-
పాలకొండలో వెలిగే పరంజ్యోతికే !! మంగళ !!
2. పంచముకము గల్ల సింహాద్రి వాసునకు
పంచ భూతములను పాలించె సర్వము !! మంగళ !!
3. నిత్య మంగళమనరే సత్యనందునకూ
అంత ఏకో నారాయణ ప్రభునకూ !! మంగళ !!
4. స్థిరమైన వాద్యాల పరమభక్తులందరు
కర్పూర హారతులు పరగ స్వామికి కివ్వరే !! మంగళ !!

**కోలశంకర్ గారిచే రచించబడిన :**

**శ్రీ సనారీ విశ్వేశ్వర స్వామి వారి తత్వ కీర్తనలు.**

**శ్రీ సనారీ విశ్వేశ్వర స్వామి వారి బైలు నాటకము.**

**శ్రీ సనారీ విశ్వేశ్వర స్వామి వారి జానపద భక్తి పాటలు.**

**శ్రీ సనారీ విశ్వేశ్వర స్వామి వారి అమృత ధార.**

-: సమాప్తం :-